# గ్రంథ రాజ్యములు

| | | |
|---|---|---|
| బ్రహ్మచర్యము | శ్రీస్వామి శివానందకృతము | రు 1-4-0 |
| జపయోగము | డిటో | 1-0-0 |
| స్వరాజ్యము | గాడేపల్లి సూర్యనారాయణశర్మ | 0-4-0 |
| స్వరాజ్యధ్వజము | పండిత సీతారామ విరచితము-నాటకము | 0-12-0 |
| వోటు | గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ. | 0-10-0 |
| అంటరానితనము మహాపాతకము | | 0-3-0 |
| ఆరోగ్యమార్గబోధిని | మహాత్మా గాంధి | 0-8-0 |
| నీతిధర్మము | డిటో | 0-4-0 |
| కోకిలాంబ (నాటకము) | సి. జగన్నాథరావు | 0-12-0 |
| సిద్ధాశ్రమము | యం. వెంకటరావు | 0-12-0 |
| శ్రీరామదండు | | 0-8-0 |
| గీతాభూమిక | అరవిందఘోష్ | 1-0-0 |
| ఉపనిషత్పాఠములు | అయ్యదేవర కాళేశ్వరరావు | 1-0-0 |
| సుఖసంసారము | పుచ్చా వెంకట్రామయ్య | 3-0-0 |
| కథలు-గాథలు | దిగవల్లి శివరావు | 1-4-0 |
| గాంధి తత్వోపదేశము | మానికొండ సత్యనారాయణశాస్త్రి | 1-0-0 |
| స్వామిరామతీర్థ ఉపన్యాసములు | | 1-8-0 |
| భగవద్గీత (యక్షగానము) | తూము సీతారామదాసు | 0-6-0 |
| శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణము పద్యకావ్యము - అయోధ్యాకాండము | వేలమూరి జానకీరామశర్మ | 1-2-0 |
| కృషిశాస్త్రము | | 3-0-0 |
| లక్ష్మణరాయవ్యాసావళి | కొమర్రాజు లక్ష్మణరావు | 2-8-0 |
| దక్షిణాఫ్రికా | దిగవల్లి శివరావు | 3-0-0 |
| బౌద్ధమహాయుగము | వేలూరి సత్యనారాయణ | 3-4-0 |
| హిందూమహాయుగము | | 3-8-0 |
| కావ్యాత్మ | శ్రీ. వెం. రాఘవయ్యంగారు | 2-0-0 |
| అలంకారమంజరి | | 2-0-0 |

హరిః ఓం శ్రీహనుమతే నమః.

# సు ధా వా హి ని

## అం కి త ము

తే॥ గీ॥ ఏను బాలుఁడ బాలలింగేశ్వరుండ
వీవు "శ్రీసుధావాహినీ" కృతిని భక్తి
నర్పణము సేయుచుంటి నీ కంకితముగఁ
గుసుమమాలిక వోలెఁ గైకొనుము దేవ!



గ్రంథకర్త:
తీర్థాల విశ్వనాథశాస్త్రి

కళాపీఠ ప్రచురణము
బెజవాడ.

# — పోషకులు —



| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ రాజా గాడిచెర్ల వెంకటగోపాలకృష్ణారావుగారు | తిరువూరు |
| ,, కొండపల్లి రామారావుగారు | విప్పలచెలక |
| ,, వైకంటి సూర్యప్రకాశరావుగారు | రామన్నపాలెం |
| ,, సోమరాజు పురుషోత్తమరావుగారు | మండాలపాడు |
| ,, ,, నరసింహారావుగారు | |
| ,, అలవాల వేంకటకృష్ణారావుగారు | వేముసూరు |
| ,, గొట్టుపర్తి వేంకటరామారావుగారు | కల్లూరు |
| శ్రీమాన్ శేషం వరవరాచార్యులుగారు | గూడెం |
| ,, శేషం శ్రీనివాసాచార్యులుగారు | అగ్రహార్ |
| మ॥ రా॥ శ్రీ నల్లమోతు సర్వయ్యగారు | అడసర్లపాడు |
| ,, కోటేరు రాఘవరెడ్డిగారు | |
| ,, ముప్పిడి నరసింహారావుగారు | |
| ,, కోటేరు వీరారెడ్డిగారు | రామన్నపాలెం |
| ,, తుమ్మూరు సీతారామారెడ్డిగారు | పోలిశెట్టిపాడు |
| ,, తుమ్మూరు వేంకటరామారెడ్డిగారు | |
| ,, అత్తునూరు బాబిరెడ్డిగారు | |
| ,, సానెకొమ్ము రామకోటారెడ్డిగారు | గోసవీడు |
| ,, చెల్లా కోటయ్యశ్రేష్ఠిగారు | కుప్పెనకుంట్ల |



ఓం శ్రీ హనుమతే నమః

# మనవి.



శ్లో॥ మద్భక్త శ్శంకరద్వేషీ మద్ద్వేషీ శంకర ప్రియః
తావుభౌ నరకం యాంతి యావచ్చంద్ర దివాకరౌ.

(విష్ణుపురాణము)

అను శ్రీ మహావిష్ణువుని వాక్యమే నాకు రాచబాట. నా యట్టి ప్రాకృతుఁడు మహామహుల కర్హమైన కవితా రచనకుఁ గడంగుట పరిహాసాస్పదమే. ఐనను మదిష్టదేవ ముద్బోధించిన తెలుంగున వ్రాసికొంటిని. ఇది నా ప్రథమ ప్రయత్నము. పాఠకమహాశయు లనుగ్రహించి ఇందలి దోషములను నా కెఱింగించినచో విధేయుఁడనై సవరించుకొందును. నా యెడఁ గృపయుంచి ఈ పొత్తమును బరిశీలించి అభిప్రాయపూర్వకముగా "ఆశీస్సు" నొసంగిన మద్గురువర్యులగు బ్ర॥ అమరవాది నీలకంఠ యజ్వసిద్ధాంతిగారికి నమశ్శతము లర్పింపుచున్నాను. నా కన్నివిధములఁ దోడ్పడిన ప్రియ మిత్రులు శ్రీమాన్ మరింగంటి సీతారామానుజాచార్యులు గారికి సర్వదా కృతజ్ఞుఁడను. పరిపూర్ణ వాత్సల్యముఁ జూపిన బంధుసత్తముఁడు యస్. యన్. మూర్తిగారి మహోపకార మెన్నటికిని మరువలేను. ఇట్టికాల పరిస్థితిలో నేత ద్గ్రంథ ముద్రణ కర్తృత్వమును వహించిన మహోదారస్వభావులకు సకల శ్రేయము లొనఁగూర్చి రక్షించుటకై సర్వేశ్వరునిఁ గూర్చి బహుధా ప్రార్థింపుచున్నాను.

భక్తజన పాదరేణువు:

**రచయిత.**

శ్రీ మాత్రే నమః

# అభిప్రాయములు

రచనా పాండిత్యము పద్యముల వైఖరి ననుసరించియే కనఁదగును. విశేష విద్యాసంపత్తిలేకున్నను నిర్దుష్ట శైలినట్లు వ్రాసినందుకు నేనేగాక సహృదయులగు మాన్యులు సైతము సంతసింపక తప్పదు. "ఈఁత డిట్టింక నుత్తమగ్రంథముల రచియించి సహృదయులచే గడింపఁబడువాఁడు గావుత" యని మన్మనఃపూర్వకముగా నాశీర్వదించుచున్నాఁడను. ఇందలి గుణాగుణములగురించి యింతకన్న విపులముగా వ్రాయుట కీతఁడు నా శిష్యుఁడగుటచే సమంజసముగా నుండదని యోచించి, అయ్యది సహృదయులగు చదువరులకే వదలితిని. "సహృదయాః ప్రమాణం"

ఇత్యాశీః

అమరవాది నీలకంఠ యజ్వ సిద్ధాంతి,
కళాప్రపూర్ణేత్యాద్యనేక బిరుదాంకిత శతావధాన
విరాజమానులగు తిరుపతి వేంకటేశ్వరుల
అంతేవాసి, తిరువూరు.

శ్రీమత్పరదేవతాయై నమః

మ. వినయంబున్ గురుదేవ భక్తియును బ్రావీణ్యంబు స్వాతంత్ర్యముం
గనఁజేయున్ బ్రకృతి స్వభావమును వేడ్కన్ దెల్పు శ్రీ విశ్వనా
థుని పద్యంబులు రమ్యహర్మ్యములు, సంతోషమ్ము గావించు వి
న్నను గన్నన్ జదువన్ సిరుల్ గలుగు నన్నా! బాలలింగేశ్వరా!

విద్వాన్, శతావధాని:
భమిడిపాటి అయ్యప్పశాస్త్రి,
పండిట్, ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్,
బెజవాడ. 6-12-1944.

క. సృష్టి స్థితి లయకారుఁ
డిష్టప విస్తృత శరీరు విశ్వేశ్వరు సం
తుష్టిని నుతియించిన నీ
కష్టము, సార్థకము పూత కలిత వయస్యా!

మరింగంటి సీతారామానుజాచార్యులు,
తిరువూరు.

ఓం శుభ మస్తు,

## (శ్రీ భరద్వాజాశ్రమ క్షేత్ర స్థిత శాసనము)

గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురురేవ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వత్సరాః. అగుసెప్క్ ౧౦౭౨ (౧౦౭౨) శార్వరి సంవత్సర మాఘ శివరాత్రౌ శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్య వర్యాష్టాంగయోగ నిరతి సర్వ జ్ఞానానంతానందామృత స్వరూప కృష్ణాశ్రమ శ్రీపాదపూజ్య శివరామ భద్రాశ్రమ శ్రీపాద పూజ్య శిష్య రఘురామాశ్రమ, శ్రీపాదపూజ్య శిష్య రామగోపాలాశ్రమ, శ్రీపాదపూజ్య శిష్య శ్రీరామచంద్ర చరణారవింద మధుప పెఖుంప బ్రహ్మానందామృతానుభవ పూర్ణాభినవ రఘురామాశ్రమ శ్రీపాదైరస్మిన్ కృష్ణా తీరే రామేశ్వరం బిల్వద్రుమ దక్షిణామూర్తించ ప్రతిష్ఠిత్వా, సర్వేషామపి శిరసావహనీయ మిదం లోకోపకారాయ కారితం, శాసన హేతుభూత క్షేత్రాధిక్యం కిమిత్యాకాంక్షాయామాహ, పురాకిల లోకపావనీ, అశేష జగజ్జననీ సకలకల్మషనాశనీ భుక్తిముక్తి ప్రదాయినీ కాశీపతి కళత్రభూతా గంగా భగవతీ స్వక్షేత్రస్థ చండాల గమనాసక్త విప్రరండా పశా హన సంపర్క ప్రాప్తకల్మష మోచనా సమర్థాసతీ కాశీక్షేత్రాత్ ఏకవేషేణేదం క్షేత్రం ప్రత్యాగత్య భరద్వాజాశ్రమ మహాయోగి తపస్స్థానభూత శ్వేత శృంగాచల ఉత్తర భాగోపరి పశ్చిమాముఖస్థిత పంక్తి బద్ధ పంచసంఖ్యాక నందికేశ్వరరూప స్థూలోపలచ్ఛాయా సమేతోత్తర వాహిన్యా మస్యాం కృష్ణాయాం ప్రాతస్స్నాత్వా పాప్యముక్తాసతీ హంసవేషేణ స్వక్షేత్రం ప్రాప్తే తీద మాఖ్యానం పూర్వైర్మహాత్మభిః కథితం అతః కారణా దిదం క్షేత్రం "గంగా కల్మష నాశన" మిత్యుక్తం కించ భ్రాతృ భగిన్యా జాయా పతిత్వరూప పాపనివృత్తి నిమిత్తబద్ధ జటామోచన స్థాన మితిచ బ్రహ్మ హత్యా నివృత్తి కరమితిచ తదుక్తం

శ్లో|| శ్వేత శృంగ గిరి ర్యత్ర కృష్ణాచోత్తర వాహినీ,
తత్ర స్నానేన పానేన బ్రహ్మహత్యాది నాశన, మితిస్కాందపురాణే-

తథాచ, ప్రౌఢ దేవరాయ కుష్ఠరోగ నివృత్తి రత్రైవాభూ దిత్యా
ఖ్యానం ప్రశస్తం-

శ్లో॥ అద్యాపి న నివర్తంతే భీమసేనోద్ధితా ఘటాః
చరంతో వాయునా బద్ధ పతంతో దృష్టిపూర్వక మితి-

ఏకాంతినాం యోగినాం బ్రహ్మనిర్వాణ మిత్యలం బహునా విప్రా దయో అస్యాం కృష్ణాయాం స్నాత్వా అచలస్థం భరద్వాజేశ్వరం తీరస దక్షిణామూర్తి రామేశ్వరో త్తరేశ్వర లింగా న్యభిషిచ్య బిల్వదళ పూజాది నైవేద్యాంతం భక్త్యా కారిష్యంతి చే త్త ఏవసర్వ పాపవిముక్తాః - భుక్తి ముక్తి పూర్ణాయుష్మంతో భవిష్యంతి నసంశయః -

శ్లో॥ మంత్రే తీర్థే ద్విజే దైవే సేవాయాం భేషజే గురౌ
యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ॥ ఇవేయం.



శ్రీహరిః ఓం

శ్రీమత్సువర్చలాసమేత హనుమత్పరబ్రహ్మణే నమః

## త్రిమూర్తిస్తుతి (షట్పాదోత్పలత్రయము)

౧ శ్రీ రమణీయ భక్తి, నొనరింతు, నమస్కృతిఁ, గోటిమన్మథా
కారికిఁ, జక్రధారికి, జగత్త్రయశౌరికి, భార్గవీ మనో
హారికి, దైత్యసంపదపహారికిఁ, దాపస మానసాబ్జ సం
చారికి, భక్తరక్షణ విచారికి, దిక్పరిపూర్ణకీర్తి వి
స్తారికి, ఘోరదుఃఖ భవసాగర తారికి, నిర్జర వ్రజో
ద్ధారికి, శౌరికిన్, సముదుదారికి, శ్రీకర పద్మధారికిన్.

౨ స్తోత్రముఁ జేయుదున్, సతము సూర్యసహస్రనిభ ప్రభోల్లస
ద్గాత్రు, సుమాస్త్రజైత్రుఁ, బగదానవ కానన వీతిహోత్రు, లో
కత్రయ సత్పవిత్రు, భవకిల్బిష భూరిలతాలవిత్రు, శ్రీ
గోత్రసుతాకళత్రు, మునికోటి ఘనస్తుతిపాత్రు, శక్రము
ఖ్యత్రిదశావళీ వదన కైరవ నీరజమిత్రు, యక్షరా
ణ్మిత్రు, మహాచరిత్రు, రజనీపతి భాస్కరవహ్ని నేత్రునిన్.

౩ ప్రీతికొలంది, సేవలొనరించెద, సర్వసుపర్వ సంఘ సం
త్రాతకు, సత్తపోజ్జ్వలిత నారద తాతకు, సర్వలోక ని
ర్మాతకు, భారతీరుచిర మానసనేతకు, శంబరాహిత
భ్రాతకు, జీవకోటి ముఖ భాగ శుభాశుభ ముద్రణక్రియా
జ్ఞాతకుఁ, గామముఖ్య రిపుషట్కవిజేతకు, శిష్టసౌఖ్య సం
ధాతకు, ధాతకున్, సకల తాపస భవ్య ఫలప్రదాతకున్.

## ఇష్టదేవతాప్రార్థన

మ. వనజాక్షాంశజ రామచంద్రపద సేవాధూర్వహున్, భక్తర
క్షణ పారీణు, సువర్చలారమణు, శశ్వద్బ్రహ్మచర్యున్, బ్రశ
స్త నవవ్యాకరణేశుఁ, జంద్రధర రేతస్సంభవున్, మానవా
శన వంశాటవి హవ్యవాహను, భవిష్యత్పద్మజున్, బ్రాజ్యపా
వన చారిత్రు, మదిష్టదైవము, నభస్వన్నందనుం, గొల్చెదన్.

## గ ణ ప తి స్తు తి

ఉ. స్వర్ణదికిన్, భవానికి, నపత్యము విస్ఫుటలంబతుండు, శ్రీ
షర్ణభవాది దేవగణవందితు, మూషకవాజి, శూర్పవ
త్కర్ణు, గజాస్యు, విఘ్నవిభుఁ, గల్మషహంతను, నేకదంతు, సం
పూర్ణదయానిధిన్, గొలుతు, మోదకభక్షణు, నార్తరక్షణున్.

## స ర స్వ తీ స్తు తి

చ. అనిశముఁ బ్రస్తుతింతు, విమలాంబుధరాభ శుభస్వరూపిణిన్,
వనధిసుతాస్నుషామణి, నవారితగాన విహారిణిన్, మహా
మణిగణభూషిణిన్, మధుర మంజులభాషిణి, సంశ్రితౌఘపో
షిణిఁ, గరుణాంతరంగిణిఁ, గుశేశయ సంభవ సౌఖ్య కారిణిన్.

ఉ. దిట్టతనంబుతో, నిను మదిం దలపోయుచుఁ, జేతఁ బొత్తము
వ్పట్టినవారికిన్, గడు గనంబగు చక్కని తెల్వితేటలన్
బుట్టఁగఁజేసి యెల్లపుడుఁ బ్రోచెద వీవని నమ్మినాఁడ, నా
పట్టున నిల్చి యందముగఁ బల్కఁగదమ్మరొ? బమ్మకొమ్మరో?

## ల క్ష్మీ స్తు తి

చ. కలుముల కాటపట్టు, తమకంబునఁ దమ్ముల నాడుచుండు పై
దలి, పెనుపక్కి నెక్కుకతె దయ్యము ఱొమ్మున నుండుచాన, పు
వ్వుల విలుకాని తల్లి, కడుఁ బున్నెముఁ గూరుచు తల్లితల్లి, తే
ములఁ దునుమాడి మమ్ములను బ్రోవదె? మిక్కిలి తాల్మిచూపులన్.

## శ క్తి స్త వ ము

ఉ. తల్లులకెల్లఁదల్లి, తొలిదండములన్ గొను వేల్పుతల్లి, బల్
తెల్లని సామిమైఁ సగముఁ దేకువఁ దాల్చినతల్లి, బత్తులం
జల్లఁగఁ జూచుతల్లి, తనసాటి పడంతులు లేనితల్లి, మా
తల్లి, యొసంగుఁ గైత సిరిఁ దద్దయు నక్కటికంబు తోడుతన్.

## సుకవిస్తుతి

సీ. శుక వాల్మీక వ్యాస సూతాది పౌరాణి
కవరులఁ గీర్తింతుఁ గాళిదాస
భవభూతి వరరుచి బాణదండ్యాది సం
స్కృత కవులకు నమస్కృతి శతంబు
లాచరింపుదు శ్రీమదాంధ్రభారత మహో
ద్గ్రంథకర్తృత్రయిం బ్రస్తుతింతు
భీమన తిమ్మన పెద్దన ధూర్జటి
మున్నగు కవులకు మ్రొక్కులిడుదు

గీ. నైషధ గ్రంథకర్త శ్రీనాథుఁ గొలుతు
నమర సింహుని వర్ణింతు, నవని సకల
విబుధులఁ దలంతు, హరిహ రాభేదకలిత
దాసజన పాదధూళి మస్తమునఁ దాల్తు,

శా. శ్రీత్యంతైక రహస్యవిజ్ఞు, సహజస్ఫూర్తిస్ఫుటామోఘపాం
డిత్యుఁ, శంభుపదారవింద భజనా నిష్ణాత్ము, ద్వైత్యాంతక
ప్రీత్యర్థ ప్రకృతాంధ్ర భాగవతు, సంవిద్రత్నముఁ, బోతనా
మాత్యుఁ, బమ్మెరవంశ నీరధివిధుం, బ్రార్థింతు వాక్సిద్ధికై.

చం. ధరణి శతావధాన కవితా విభవంబు గడించి, సర్వభూ
వరతతి మెప్పునొంది, బుధవర్గ శిరోమణులై, మహాత్ములై,
పరమ యశః ప్రభాప్రకటభాసిత దిగ్వ్రజులై, చెలంగు శ్రీ
తిరుపతి వేంకటేశ్వర సుధీవరులన్ భజియింతు నాత్మలో.

## గురుస్తుతి

సీ. తిరుపతి వేంకటేశ్వర కవిపుంగవాం
తేవాసి ముఖ్యుఁడే ధీవరుండు
తత్కృత భారతోద్యన్నాటకాభ ప్ర
కృతభారతుం డే కవీశ్వరుండు

మదర్చిత కవిత్వ సదర్స దోషాప
హరుఁడే మహామహితాత్మకుండు
అస్మదజ్ఞాన మహాధ్వాంతహరణ మం
త్రోపదేశకుఁడే కృపాపరుండు

గీ. ఆదిశక్తి సుభక్తుఁడే యనఘ చరితుఁ
డట్టి యమరవాది కులసుధాంబురాశి
నీరజాహితు, బుధహితు, నీలకంఠ
యజ్వ సిద్ధాన్తి గురువరు నభినుతింతు.

మ. అతులానందములోడ వేడెద, సముద్యత్సూర్య పుత్త్రీమనః
పతి సంపూత మహత్త్వ తత్త్వరుచి రోపన్యాసకున్, లోకపూ
రిత సత్కీర్తి విశాలు, మద్గురుకృపా శ్రీధుర్య రక్షః పిశా
చ తతి ధ్వంసక మంత్రశాస్త్రవిధు, శిష్టా చంద్రమౌళీశ్వరున్

---

# శ్రీ బాల లింగేశ్వర శతకము



శా. శ్రీభక్తాశ్రిత సాధుజీవనమణీ! బృందారకగ్రామణీ!
ప్రాభావ్యాంచిత లింగరూపక భరద్వాజేశ్వరా! శ్వేతశృం
గాభిఖ్యావనిభృన్నివాస! పరమేశా! పార్వతీవల్లభా!
భూభారాపహ! నందివాహ! శివ! శంభో! బాలలింగేశ్వరా! 1

శా. శ్రీసోమార్ధకళాకిరీట! హృతగర్విష్ఠాగ్రిదోఃపాట! స
ద్దాసార్త్యగ్నిరజఃకృపీట! విలసద్గంగా జటాజూట! సం
వాసభ్రాజిత శైలకూట! సుమనోవర్గావనఖ్యాత దీ
క్షా సంచర్విత కాలకూట! నిటలాక్షా! బాలలింగేశ్వరా! 2

శా. అంభోధీశ్వరతూణ! చక్రధరబాణా! నిత్యకల్యాణ! సం
రంభోపేత వృషేంద్రయాన! విమల భ్రాజత్పరిజ్ఞాన! స
ద్గంభీరోక్తివితాన! పావన భరద్వాజాశ్రమస్థాన! స
ర్వాంభోజాత భవాండ రక్షణ ధురీణా! బాల లింగేశ్వరా! 3

శా. పూతా! మంజుల ధీసమేత! మహితా! భూతాధినేతా! కుభృ
జ్జాతా ప్రీతి విధాత! పోషిత సుధీసంఘాత! స్రస్తాఖిలో
త్పాతా! ఘోరభవాబ్ధిపోత! శుభదాతా! సత్యసంకల్ప వి
ఖ్యాతా! సంశ్రిత పారిజాత! శివ!సాంబా! బాల లింగేశ్వరా! 4

శా. సత్కారుణ్య గుణప్రధాన! త్రిజగత్సంతోష సంధాన! భూ
భృత్కన్యానవ పంచబాణ! రజతాద్రిస్థాన! వేదాంత శుం
భత్కల్యాణ! వచః ప్రమాణ! మునిగీర్వాణౌఘ సంత్రాణ! దు
ర్వారోత్కాలాభ్రమరుత్సమాన! సుమనా! శ్రీబాల లింగేశ్వరా! 5

మ. నళినారాతి కళాకలాప! హృత నానాలోకసంతాప! దు
ష్కలుషశ్రేణి దళత్ప్రతాప! నిజభక్తవ్రాతగోగోప! ని
స్తులవేదార్థయుతానులాప! హిమవత్పుత్రీమనోద్దీప! యు
జ్జ్వల చామీకర శైలచాప! శుభరూపా! బాలలింగేశ్వరా! 6

శా. శ్రీక్షోణీధ్రసుతామణీ హృదయ నీరేజాతరోలంబ! శి
ష్టక్షేమ ప్రదదీకదంబ! త్రిజగత్సంక్షోభ కృత్కామ గ
ర్వక్షోణీధరశంబ! సాంబ! సతహేరంబా! శ్రితవ్రాత సం
రక్షాభూరిదయావలంబ! భవదూరా! బాలలింగేశ్వరా! 7

శా. శ్రీ యోషిత్పతి ధాత్రగేయ! సుజన శ్రీదాయ! లోకత్రయీ
శ్రేయా! భక్తవిధేయ! నిర్మల పయోభృత్సన్నిభప్రస్ఫుర
త్కాయా! సత్కరుణా విభూత్యవిత మార్కండేయ! సుజ్ఞానధా
రేయా! ధర్మవధూసహాయ! వరదా! శ్రీ బాల లింగేశ్వరా! 8

శా. ధీరా! పుణ్యవిచార! సంహృత ధరిత్రీభార! సత్కీర్తి వి
స్తారా! సంగరవీర! భక్తజనమందారా! మహోదార! సం
సారాగణ్య కుఠార! భూరి కరుణాసారా! నతోద్ధార! ఓం
కారాకార! వికారదూర! నిటలాక్షా! బాలలింగేశ్వరా! 9

మ. వృజినాంభోనిధి కర్ణధార! గిరిపుత్రీచారు హృచ్చోర! భ
క్తజనక్లేశవిదార! సర్వ జగదాధారా! విషాహార! చి
త్తజసంహార! భుజంగహార! విమతధ్వంస క్రియాశూర! శ్రీ
రజతాహార్య విహార! పావనశరీరా! బాలలింగేశ్వరా! 10

మ. పవిభృన్ముఖ్య మరుత్కిరీట మణిరుగ్భ్రాజత్పదాంభోజ! భ
క్తవరేణ్యామరభూజ! భానుశత సంకాశస్ఫురత్తేజ! మై
త్రివిశేషావితరాజరాజ! రిపుసంహృద్ధర్మరాజా! హరి
స్తవనీయానుపమాన సద్గుణ సమాజా! బాలలింగేశ్వరా! 11

మ. అవితాఖండ పితామహాండ! సమవర్త్యంభోజ వేదండ! భ
క్తవితానైక మనః కృపీటరుహమార్తండా! మహోద్దండ! శా
ర్వవిరాజద్ఘనబాహుదండ! పృథుధర్మక్ష్మాధ్రికోదండ! స్వ
ష్టవిధస్థావర జంగమాన్వితపిచండా! బాలలింగేశ్వరా! 12

శా. హస్తీంద్రాజిన రమ్యచేల! కలధౌతాద్రిస్థలీఖేల! శ్రీ
హస్తోద్యద్ధృతదీర్ఘశూల! పరిభుక్తాఖిల కాకోల! వి
ధ్వస్తాశేష విరోధిజాల! గిరిజాతాలోల! భూషా ప్రవి
న్యస్తవ్యాళ! కృపాలవాల! శ్రితపాలా! బాలలింగేశ్వరా! 13

మ. తతధావళ్య సముజ్జ్వలాంగ! హిమవత్కన్యా పరిష్వంగ! దు
ష్కృత సంసారతమః పతంగ! విధృత శ్రీ వ్యోమగంగా! విప
త్తతి ఘోరాహివిహంగ! శ్రీయుత భరద్వాజ ప్రతీతప్రతి
ష్ఠితలింగా! వృషరాట్తురంగ! సుభగా! శ్రీబాలలింగేశ్వరా! 14

మ. సరసాపాంగ విభూతిరక్షిత జగత్సందోహ! శ్రీమత్ప్రభా
కర సాహస్రసమానదేహ! శ్రితసౌఖ్య శ్రీప్రదోత్సాహ! భా
స్వర యోగీంద్ర మనోజ్ఞగేహ! హృత దుస్సంసార మోహా! మహా
పురదైత్యాటవిహవ్యవాహ! శివ! శంభో! బాలలింగేశ్వరా! 15

శా. షట్స్థాన మలంకరించిరి మహీజద్వాదశాత్మాత్మజుల్
దుష్టాభిఖ్యులు నాదు జాతకమునందున్ వక్రియౌ మంత్రి లో
నష్టాకారుని కావ్యునంతర మి దెన్నాళ్ళుండునో యింక నన్
భ్రష్టున్ జేయకుమయ్య రెంటికిని సాంబా! బాలలింగేశ్వరా! 16

శా. ఉర్వీధ్రేంద్ర సుతామనస్సుఖవిధానోద్యత్క్రియాపర్వ! శ్రీ
శర్వా! యోగకళావిభూతి దళితాజ్ఞాతాస్త్ర సమ్యఙ్మనో
గర్వా! శ్రీపతి నుత్యమంగళగుణాఖర్వా! కృపారక్షితా
శ్యోర్వీదేవ సుధీసుపర్వ! శివ! శంభో! బాలలింగేశ్వరా! 17

శా. రుద్రా! భూరి దయాసముద్ర! మహిమారోచిస్ఫురద్రమ్య రా
ప్యాద్రి శ్రీ శిఖరస్థలీ ప్రకటితోద్యద్యోగనిద్రా! సదా
భద్రా! విష్టపరక్షణార్థ ధృత దివ్యజ్ఞానముద్రా! సద
ర్పోద్రేకస్మరఘాతరౌద్ర! శివ! శంభో! బాలలింగేశ్వరా! 18

శా. ఈశా! మైత్రీవశీకృతోత్తరదిశాధీశా! నిషంగీకృతా
బ్ధీశా! కంకణ సామ్యసంధృత భుజంగేశా! విధూతాఖిలా
ర్ధాశా! శైలనివేశ! నిర్దళిత యామ్యాధీశ! సమ్మోదిత
శ్రీశా! జ్ఞానకళా ప్రకాశ! గిరిశా! హేబాల లింగేశ్వరా! 19

శా. అక్షీణోద్ధత దర్పయుక్త పురదైత్యానేకసాభీలహ
ర్యక్షా! గంధగజాంధకాసుర విపక్షా! భక్తరక్షా! మహా
దీక్షా! రమ్యవిశాల వక్ష! గిరిపుత్రీ రత్నదేహార్ధ ధృ
ద్దక్షా! సంశ్రిత కల్పవృక్ష! శశిమార్తాండానలాక్షా! సురా
ధ్యక్షాదిత్రిదశౌఘపక్ష! విషభక్షా! బాలలింగేశ్వరా! 20

శా. భర్గా! మంజు పిచండగుప్త నిఖిల బ్రహ్మాండ పాతాళభూ
స్వర్గా! సాంద్రవిలాస వాజ్నికర శశ్వల్లాలిత స్వర్ణదీ
దుర్గా! పాలితధర్మమార్గ! సుతపోద్యోగ ప్రభావస్ఫుర
ద్గర్గవ్యాసశుకాదినుత్య గుణవర్గా! బాలలింగేశ్వరా! 21

శా. శ్రీదా! నృత్యకళావినోద! కలుషచ్ఛేదా! జగన్మంగళో
త్పాదా! శైలసుతాకుచాచలపయోదా! శత్రువ్రాతాళిని
ర్భేదా! మాన్యతవాద! మౌనినివిశద్బృందార్చిత ప్రోల్లస
త్పాదా! ఓంకృతినాద! భక్తజనమోదా! బాలలింగేశ్వరా! 22

మ. సతత ప్రోజ్జ్వల సత్యభాష! సుమహత్సంతోష! సమ్యక్తనూ
ద్యుతిసంపర్జిత పూష! నిర్గళితదుర్దోషా! మహాసర్ప వి
ఘృతభూషా! రఘుభీకరోక్తి చయనిర్ఘోషా! సదామంగళాం
చితవేషా! నతలోకపోష! వరదా! శ్రీబాలలింగేశ్వరా! 23

శా. దేవా! దివ్యతతః ప్రభావ! యభవా! దేవాదిదేవా! మహా
దేవా! సంహృత పూర్వదేవ! నతపృథ్వీదేవ! దంభోళిభృ
చ్ఛ్రీవిష్ణు ప్రముఖ ప్రపూజ్య పదరాజీవా! విషగ్రీవ! దు
ర్భావాభావ! మహానుభావ! శివ! సాంబా! బాలలింగేశ్వరా! 24

శా. ఆద్యా! నీరజగర్భ కేశవ సురేంద్రారాధ్య! వేదాంతసం
వేద్యా! శశ్వదఖండ యోగవిలసద్విద్యా! జగత్కంటకా
సాధ్యా! భవ్యగుణానవద్య! సుమనస్సద్భక్త యోగీంద్ర హృ
త్సాధ్యా! సంసృతి రోగవైద్య! గతమిథ్యా! బాలలింగేశ్వరా! 25

శా. అక్షీణాఘసమేత జీవ నిజ తోయ వ్యూహసంప్రాతకృ
త్సాక్షాదుత్తర వాహినీ కలిత కృష్ణాతీర సమ్యక్ప్రసి
ద్ధక్షోణీధర కూటసంస్థిత భరద్వాజాశ్రమాంతస్ఫుర
త్ప్రక్షేమ ప్రకటావతార! శ్రుతిసాగా! బాలలింగేశ్వరా! 26

శా. నీతేజోద్భవుఁడైన వాయుతనయుం న్విశ్వాసయుక్తోన్నత
ప్రీతింగొల్చుచుఁ దత్కటాక్ష మహిమావిర్భూత విజ్ఞానినై
కైతక్ష వ్రాయఁగఁ బూనుకొంటి బహుధా కాఠిన్యశబ్దార్థ వి
జ్ఞాతుంజేయఁ గదయ్య నన్ను నిఖిలజ్ఞా! బాలలింగేశ్వరా! 27

శా. వ్యాసాది ప్రథమాన మౌనులు, మహాప్రజ్ఞానిధుల్. సత్కవుల్,
నీసంపూతకసచ్చరిత్రరచనా నిష్ణాతులయ్యున్ గనం
గా సుంతేనియు గర్వమొంద రిపు డీ కాలంబునందున్ గవుల్
బూనుల్ గీసులు వ్రాసి నిక్కెదరు శంభూ! బాలలింగేశ్వరా! 28

మ. జననంబాదిగ నింత కాలమును సంసారాంధకారంబునం
దునసే చొచ్చి తపింపఁ బాపవిష జంతుశ్రేణి బాధింపు చుం
డిన దిక్కెదియులేక హీనగతి నుంటిన్ గాన నీనామచిం
తనముం గూర్చి తరింపఁ జేయుము మహాత్మా! బాలలింగేశ్వరా! 29

మ. భువనంబుల్ సృజియింపఁ బెంపఁగను నిర్మూలింప రాజీవసం
భవ దామోదర శంకర ప్రథిత రూపంబుల్ వెసందాల్చి దు
ర్భవపాథోధిఁ దరింపఁజేసి జనులన్ బాలింపు చుంటన్ సదా
శివుఁ డీవంచు నుతింతు రోవిదు లహో! శ్రీ బాలలింగేశ్వరా! 30

మ. అహిరాజేంద్రుఁడు నీకుఁ గంకణము, నిన్నర్చింత్రు బ్రహ్మాచ్యుతు,
ల్మిహిరాబ్జారిహుతాశనుల్ నయనము, ల్వేధోండ మెల్లన్ భవ
న్మహిమన్ గన్నడు, నిర్జరుల్ మునులు యుష్మత్సేవకుల్, చూడ ని
మ్మహిలో నీసరిదేవుఁడుండెనొకొ? సాంబా! బాలలింగేశ్వరా! 31

శా. తోడై నీడయి సాకుచుండు భగవంతుం డీవయై యుండఁగా
మూఢుల్ కొందఱు దుస్స్వభావమున శంభుండెవ్వఁడో, దేవుఁడుం
గాఁడంచున్ గడునింద సేయుదురయో! గౌరీమనఃపల్వల
క్రోడా! నీ మహిమం బెఱుంగఁ దరమొక్కో ? బాలలింగేశ్వరా! 32

శా. నీకున్ మంగళదేవతావిభునకున్ నీచాత్ములై మానవా
నీకంబుల్ కడుభేదమెంచుచు సదా నిందింతు రో దేవ! నీ
వే కంజాతభవుండ వచ్యుతుఁడ వీవే శాంకరీభర్త వీ
వే కంజాతభవాండ పోషకుఁడ వీవే బాలలింగేశ్వరా! 33

శా. ఓ సర్వేశ్వర! యోకృపాజలనిధీ! యోభక్తచింతామణీ!
యోసర్వజ్ఞ! భవాంబురాశితరణా! యుష్మత్పదాబ్జద్వయం
బే సేవింపఁదలంచుకొంటి, గతినీవేయంటి, ముక్కంటి! నా
యాసల్ వీసరఁ జేయ నెంచకుము సాంబా! బాలలింగేశ్వరా! 34

శా. చండోగ్రాత్మజపాశబద్ధగళుఁడై "శర్వా! మహాదేవ! నీ
దండంజేరితి నమ్మియుంటి" నని యుద్యద్భక్తిఁ బ్రార్థించు మా
ర్కండేయున్ గనుఁగాచితీవటుల నన్గాపాడరాదా "దురా
త్ముండౌవీఁ" డని మిన్నకుంటివొకొ? శంభూ! బాలలింగేశ్వరా! 35

శా. అన్నా! నామొరలాలకించి "యిటురారా" యంచు నోదార్చి, నా
పన్నుండన్ గరుణించి యేలుమనుచుం బ్రార్థింపు చుంటిన్ గదుం
బున్నెంబుండును దీనునేలిన, భవాంభోరాశి దాటింప నీ
కన్నన్ ధీరుఁడొకండులేఁడు నిటలాక్షా! బాలలింగేశ్వరా! 36

శా. కట్టా! యింతగవేఁడుచుండఁగ మదిన్ గాఠిన్యమున్ బూని యి
క్కట్టుల్ పెట్టుచునుంటి విట్టులనహో! గౌరీశ! నీసేవకున్
వట్టిట్టన్ బడవైవఁగా నగునె? నన్బాలింపరాకున్నచో
నొట్టున్ బెట్టెద నేఁడురాత్ముఁడను శంభూ! బాలలింగేశ్వరా! 37

శా. ఆయుష్యాంతముఁ గాకమున్నె, ఘనపైత్యాద్యామయవ్రాతముల్
కాయంబంటకమున్నె, బుద్ధియుఁ గనుల్ కార్శ్యం బెడంబోకము
న్నే, యుష్మత్పద భక్తి నాకొసఁగు మంతేకాని సమ్యగ్భవ
న్మాయాంభోనిధిలోన ముంపకుము సాంబా! బాలలింగేశ్వరా! 38

శా. నిన్నే నమ్మినవాఁడనంటి, ఘనమౌ నీపాదపద్మద్వయం
బెన్నండేనియు వీఁడనంటి, దయరానిమ్మంటి, నావంటి యా
పన్నశ్రేణి గఠిందలంచి మనుపన్ బాధ్యుండవీవంటి, నీ
పున్నెం బీయుపకారమున్ సలుపు శంభూ! బాలలింగేశ్వరా! 39

శా. ఈ జన్మంబున దుష్ప్రవర్తకుఁడనై హీనుండనై యుంటి, ముం
దేజన్మంబుల నెత్తఁగా వలయునో? యింకేమి ప్రాప్తించునో?
రాజీవాప్తతనూజుఁ డుగ్రుఁడయి నిర్దాక్షిణ్యుఁడై శిక్షలే
యాజన్ నాకు విధించునో, తెలియదయ్యో! బాలలింగేశ్వరా! 40

శా. నీడో కలా నశించుదేహము, వృథానిర్ణీతభాగ్యాళిక
ల్లాడన్ లాభములేదు, బంధుహితభార్యానందనుల్ పేర్మిమై
తోడైరా, రిటువంటి జీవితము నెంతో నమ్మి వర్తించు దు
ర్మార్గున్ నన్నుఁ గటాక్షదృష్టిఁగను శంభూ! బాలలింగేశ్వరా! 41

మ. గృహిణీ పుత్త్రికు, లాప్తకోటి భయవార్ధిన్ మున్గగా, మృత్యుస
న్నిహితంబౌతరి దండహస్తుని భటానీకంబు విచ్చేసి యా
గ్రహముంజూపుచు నెవ్విధంబుగ, ననుంగారింతురో? శైలరా
డ్దుహితావల్లభ! నన్నుఁగావు శ్రితబంధూ ! బాలలింగేశ్వరా ! 42

శా. "వారో వీరో మఱెవ్వరో ఘనజగద్వంద్యుల్ భవత్తత్త్వ స
త్సారజ్ఞాంచితులైనవా"రని భువింజాలన్ విచారింప నె
వ్వారున్ దర్శనమీయరైరి యిఁక నెవ్వారుందు? రచ్చోటికిన్
దారింజూపుము నీకు దండము మహాత్మా! బాలలింగేశ్వరా! 43

మ. గురువర్యుండు లభింపకున్కి మదిలోఁ గొన్నాళ్ళు చింతించి, స
ద్గురుఁడొక్కండు లభింపఁగా మివుల సంతోషాన నుప్పొంగి, త
ద్గురుకారుణ్యముచేత సత్పథము గన్గొంటిన్ బళీ! కాలకిం
కరులంజూచి భయంబుఁజెందనిఁక నుగ్రా! బాలలింగేశ్వరా! 44

శా. కట్టన్ బట్టయు మెక్కఁదిండియును జక్కన్ లేక యొల్లప్పుడున్
బట్టుంబోలెఁజరించువాని ఘనశైవంబంచుఁ గీర్తింపుచో,
నెట్టుల్లోకము నమ్మ? నేమయిననఁగానీ! నమ్మి సేవింపఁగాఁ
బట్టుంబట్టితి నిన్ను నేవిడువ సాంబా! బాలలింగేశ్వరా! 45

శా. అసల్ పెక్కు జనింపఁజేయుఁ, బరవిత్తాసక్తిచేతన్ దురా
యాసంబొంది కృశింపఁజేయును, నికృష్టానీకముంజేరి వే
దోసిళ్ళొగ్గి నుతింపఁజేయును, మహాదుఃఖంబుఁ గల్పించు, ఛీ!
ఛీ! సంసారము ఘోర దుర్గతి కదా! శ్రీబాల లింగేశ్వరా! 46

శా. తల్లిందండ్రినిఁ దూలనాడి, బహుధూర్తస్నేహముంజేసి, దు
ర్వార్త్యల్లోకంబును విశ్వసించి, బుధులన్ హీనంబుఁగాఁజూచి, గ
ర్వోల్లాసంబునఁ బొద్దుపుచ్చు దురితోద్యోగుండనా, నాకు యు
ష్మల్లీలా విభవంబెఱుంగఁగఁ దరంబా! బాలలింగేశ్వరా! 47

మ. మతి చాపల్యముచేత సంతతము దుర్మార్గంబునం బోవుచున్
వెతలంగాంచుచునుంటి నొక్కతరి భావింపన్ మహాఘోరమౌ
స్థితియున్ గోచరమౌచునుండెఁ గరుణాదృష్టి న్విలోకించి నా
గతికై సద్గతిఁగూర్చి యేలు మకళంకా! బాలలింగేశ్వరా! 48

శా. ధూర్తస్వాంతులు, సత్యదూరులు, సుహృద్ద్రోహుల్, మదప్రాప్త దు
ష్కీర్తిప్రాజ్యులు, విప్రవైరులుఁ, బరస్త్రీకాము. లంహఃక్రియా
కర్తల్, వేలకువేలునై కలి సదా గారింపుచున్నారు మా
యార్తింజూచియు నూరకుండెదవటయ్యా! బాలలింగేశ్వరా ! 49

మ. ఒక యోషామణి కర్ధదేహమిడి, వేఱొం డంగనన్ నెత్తిమీ
దికినెక్కించుక కుల్కులాడుచు స్మరోద్రేక స్థితింబొల్చు నీ
వకలంకైక విరాగివై ట్లగుదువయ్యా? చూడ నిన్గొల్చువా
రిఁకవైరాత్తి వచింత్రుగాని పురవైరీ ! బాలలింగేశ్వరా ! 50

శా. ఆహా ! లోకులు చూచి మిక్కిలి పరీహాసంబు గావింతు రం
చూహల్ సేయక, నీటిమేనుగలదై యుప్పొంగు స్త్రీనిన్ గురు
ద్రోహిన్ నెత్తి నఁబెట్టుకొన్న చపలాత్మున్ నిన్నుఁబూజింప ను
త్సాహంబూనెద రేటికో? బుధులు నేతా ! బాలలింగేశ్వరా ! 51

శా. కాముఁగాలిచి, తోలుఁదాల్చి ఘనభిక్షావృత్తి వైరాగివై,
యేమాత్రంబును హద్దులేనిమతివై, యేపారు నీకెందు క
య్యా ! మాతల్లులు స్వర్ణదీగిరిజ:ల య్యావత్కథంచెల్పి నా
లో మాలిన్యము సంహరింపుము కృపాళూ! బాలలింగేశ్వరా! 52

శా. ప్రేమన్ బిల్చియుఁ, గూతునిచ్చి, విధిగాఁ బెండ్లిందగం జేసి, యు
ద్దామ ప్రస్ఫుట బంధుతా గరిమచేఁ దానొప్పఁగా నిర్దయ
న్మామం జంపి, తదధ్వరంబుఁ జెరుప న్వాల్పడ్డ నీకవ్విధిన్
మోమోటం బొదవున్? శ్రితాళియొడఁ; శంభూ! బాలలింగేశ్వరా! 53

మ. అణిమాద్యష్ట విభూతు లుండఁగను, ద్రవ్యాధీశ్వరుండై సుహృ
న్మణి తానుండఁగఁ, దోడివారు ఘన శుంభద్వస్త్రముల్ దాల్పఁ, దో
లు నొగిం దాల్చిన నిన్ను హేళనముగా లోకుల్ ప్రసంగింప, కే
వినుతిం జేయుదు: రేమిచిత్రమొ? కృపాబ్ధీ! బాలలింగేశ్వరా! 54

మ. చెడుగుం బోకడఁబోయి, స్వీయగురు సత్సీమంతినింగూడి, లె
క్కిడరానట్టి యఘంబుఁగైకొని, కళాహీనస్థితిం బొల్చున
య్యుడురాజున్ దగుశిక్ష సేయక! పరిపూర్ణోత్సాహివై నెత్తిపై
నిడుకొన్నాఁడవు ధర్మవర్తన మిదా నే? బాలలింగేశ్వరా! 55

మ. అడుగంబూనితి నొక్కమాట విను మీవశ్రాంత మెవ్వారికే
మిడెదో? బంగరు మూటలంచుఁ బ్రమథుల్ బృందారకుల్ నిన్ను నా
క్కడు గైనం గదలంగ నీయ రట్టు నీవట్లున్న నీతాతయై
వ్వఁడు రక్షించును మమ్ముఁజెప్పుమిఁక సాంబా! బాలలింగేశ్వరా! 56

మ. కుడువన్ గూడును దాల్ప నంబరములన్ గోట్లాదిగా విత్త మీ
విడఁగాఁ జాలిన దాతవే యగుదు వవ్వేవీ దురాపేక్ష నే
నడగంజూడను నుమ్ము చిత్తమున మోక్షాసక్తి పెంపొంద నీ
యడుగుందమ్ములఁ బూజసేయుదు మహేశా! బాలలింగేశ్వరా! 57

శా. కల్లల్ సేయుచు సేవ కావలి నిటుల్ గారింప నీ బోటికే
చెల్లెంబో; మఱిఁజెల్లు నేరికి? భువిం జేమోడ్చుచో గట్టుతే
నల్లుం డోమును గాని కాదనఁడు సు మ్మంచున్ బుధుల్ చెప్ప నీ
కాళ్ళంబట్టితిఁ గన్నతండ్రి! నిటలాక్షా! బాలలింగేశ్వరా! 58

శా. శ్రీరామేశ్వర నామచిహ్నిత మహాక్షేత్ర ప్రభావస్థితిన్
దారున్ సుంతయు నాత్మ నెంచక వృథాతర్కోక్తులన్ ధర్మశా
స్త్రారిత్వంబు వహించి మిక్కిలి విశిష్టాద్వైతు లెల్లపునిన్
దూరం జూతురు వెఱ్ఱులౌచు శ్రితబంధూ! బాలలింగేశ్వరా! 59

శా. మాసమ్యజ్మతమే ప్రధాన, మరయన్ మాదేవుఁడేమేటి, మీ
వేసాల్ చూచిన దోసమబ్బునని విద్వేషంబుతోడన్ భవ
ద్దాసశ్రేష్ఠుల దూరుక్రూరుని ముఖద్వారంబు బంధింపలే
వా? సర్వేశుఁడ వీవుగావ? శివ! సాంబా! బాలలింగేశ్వరా! 60

శా. దోషాటుల్ మును నీకు భక్తులయి, యెంతో ద్వేషమున్ బూని, శ్రీ
యోషాధీశుఁ దిరస్కరించి, రటులే యుర్విన్ హరద్వేషులై
పాషండుల్ నిను వెంబడించి రరయన్ ద్వైతంబిదే యంచుఁ ద
ద్దోషంబెట్టిదో వారికిం దెలుపరాదో! బాలలింగేశ్వరా! 61

మ. సమతాద్వైతవిధిన్ నినున్ మఱియు శ్రీశౌరిన్ సదాకొల్చుచున్
బ్రమదం బొందుచునుంటి మిట్టిమము సంరక్షించెదో? లేకని
త్యముఁ బాషండుల మాటలన్ విని వృథా దండించెదో? సర్వభా
రము నీదేసుమి దేవదేవ! జితమారా! బాలలింగేశ్వరా! 62

మ. నినునిందించి హరిన్ భజించు నొకఁడున్, నీసేవఁగావించి హ
రినినిందించు నొకండు, ఈవతలి నేరీతిన్ బ్రవర్తింపుమం
చునువేదంబు వచించునో? తలపకజ్ఞుల్ మీకు విద్రోహులై
కనరానందము రెండులోకముల నుగ్రా! బాలలింగేశ్వరా! 63

మ. ప్రణవజ్యోతి శరీరులై, భువన నిర్మాణాంత సంత్రాణ కృ
ద్ఘనులై, వెల్గెడి నీకు శ్రీపతికి భేదంబున్నదే సుంతయున్
ముని దేవాదు లభేదశేముషి మిము న్బూజింపరే? కట్టా! యీ
మనుజశ్రేణుల కేమి రోగ మిది సాంబా! బాలలింగేశ్వరా 64

శా. వేళాకోళము వెక్కిరింపులను భూబృందారకానీకమున్
జాలన్ దూరుచు, దుష్టులీ పుడమి శశ్వద్వృద్ధిచే నుండ, నిం
కేలా చూచెదు? హాస్యమంచు మదిలో నీవెంచినావేమొ? కా
దాలోచించియు వారలం గడప రమ్మా! బాలలింగేశ్వరా! 65

మ. “గుడిలోనుండిన బండ దేవుఁడగు నొక్కో? యిద్దిమేలైన రు
బ్బుడు పొత్రం” బని ప్రేలు దుర్జనుల నోర్మూయింపఁగాలేక నీ
యడుగుందమ్ములఁ గొల్చు సజ్జనుల కత్యంత ప్రమాదంబులౌ
నిడుమల్ గూర్తువదేమి కారణమొ? స్వామీ! బాలలింగేశ్వరా! 66

మ. అనిశం బా రజతాద్రి శృంగమున నీహారాద్రిజం గూడి, న
ర్తనమునన్ జేయుటగాదు విన్మ గతధర్మం బంతయున్ భూమిపై
నొనరన్నిల్పుట గొప్ప కార్యమిది నీ యొయ్యారమున్ వీడి, చ
య్యన రావయ్య వృషేంద్రునెక్కి శివ! సాంబా! బాలలింగేశ్వరా! 67

మ. విసుఁగుంజెందక నీదువెంటఁ బడితిన్ వెఱ్ఱెత్తి, నా చేతఁగా
దసలే యీ పనియంచు వాకొనినఁ దంటాయేమి? నీ కిప్డు నా
దెసగా నిల్చియుఁ దేల్చుమీ చెడుగునీదే, మంచియు న్నీదె, నీ
పస నే నింతయు లోనెఱుంగుదుఁ గదప్పా! బాలలింగేశ్వరా! 68

శా. ఎన్నో మారులు మందలించినను సుంతేనిం బ్రసంగింపవే?
మిన్నా శైల సదుత్తరంబిడఁగ నీ వృత్తాంతముం దెల్పెఁబో
“నన్నున్ వీఁడు కదల్పలేఁ”డని మదిన్భావించితోఁ గాని నే
నిన్నున్ వీడ నికెన్ని జన్మములకేనిన్ బాలలింగేశ్వరా! 69

మ. అరయన్ బ్రాణుల సృష్టిసేయుచు సమర్థ్యబ్జోద్భవుం డొప్పారఁ ద
త్పరి రక్షాక్రియ శౌరిసేయఁగను వహ్వా! నీవు ప్రోద్యద్భయం
కరలీలన్ లయమొందఁజేయుదట నిన్ గాంక్షించి సేవించు వా
రరయ భద్రస్థితి నెట్లుగాంచెదరొ? శంభూ! బాలలింగేశ్వరా! 70

మ. విలయంబన్నను దుఃఖమూలముగదా! వేడ్కారఁగాఁ దత్క్రియన్,
సలుపన్ బొల్పడినట్టి నీకు స్ఫుటరాజచ్ఛంకరాభిఖ్యయున్,
కలనన్ నీ పనులెల్ల మెచ్చుకొను దుర్గాదేవికిన్ సర్వమం
గళ యన్పేరెటు సార్థకంబగునొ? యుగ్రా! బాలలింగేశ్వరా! 71

మ. హరి శైలేంద్రులు బాణకార్ముకములై, యబ్జీశుఁడుం దూణమై,
వరసాహాయ్య మొనర్పుచుండఁగ, బృహద్భాసుండు చక్షుస్స్థిత
స్ఫురదుండై, త్రిపురంబులన్ సురగణంబుల్ మెచ్చఁగాఁగాల్చె, నిం
దరయ న్నీదు ప్రతాపమేమికలదయ్యా! బాలలింగేశ్వరా! 72

మ. అసువుల్ దీయునటంచు భీతిపడి హాహాకారముల్ సేయు దే
వసమూహంబుల గోడుమాన్పుటకు వహ్వా! శాంబరీ విద్యచే
విసమున్ గంఠమునందు నుంచితివి నీ వేషాల్ మదిందల్ప సం
తస మాశ్చర్యము గల్గు భక్తులకు, నేతా! బాలలింగేశ్వరా! 73

మ. తనకుం దుల్యుఁడ వౌటనో? మఱియుఁ బాంధవ్యంబదే ముంటనో?
తనయుం జంపితివంచు రోసమునొ కింతె న్నీ యెడ న్బూనఁ డ
వ్వనజాక్షుం, డటు కానిచో ధరణిలోఁ బాషండులున్ వైష్ణవుల్
ఘనతంజేయు కుతర్కమెప్డు నిజమౌఁగా బాలలింగేశ్వరా! 74

మ. అగరాట్కన్యను బెండ్లియాడుతరి భాషాధీశు శీర్షంబునుం
దగ ఖండించితి వట్టి వర్జిత శివున్ నిన్నెల్లకాలంబు వే
ల్పుగముల్ మెచ్చి సదాశివుండవని కేలున్ మోడ్చి నీ చిచ్చుక
న్నొగి నీ గౌరవమెంతయు న్నిలిపె శంభూ! బాలలింగేశ్వరా! 75

మ. నగజానూత్న కళావిభూతిఁగని స్వాంతంబందుఁ జింతించెనో?
జగడం బేటికటంచు నుద్యమముఁ దాఁజాలించెనో? కాని; నీ
మొగముల్ జూచియు మాన డప్పు డజుఁడే మూర్ఖించుచో సర్వలో
క గురుండీతని లెక్కసేయునొకో? యుగ్రా! బాలలింగేశ్వరా! 76

మ. అసమైశ్వర్యము గల్గినందుకును, సద్వ్యాప్తి చేకూర ష
డ్రిసయుక్తంబగు నన్నముం గుడుచుటే రమ్యంబగున్నాక, లో
క సమాజంబుల రూపుమాపఁగ, మహోగ్రంబై విజృంభించు వ
వ్యసనముం మెక్కుతి వేమికర్మము? కృపాబ్ధీ! బాలలింగేశ్వరా! 77

శా. అష్టైశ్వర్యయుతుండవౌటను, మహేశాభిఖ్య నీకుం సదా
స్పష్టంబై యలరారుచుండెఁగద నీ చందంబు నూహింపకే
కష్టంబొందుచు బిచ్చమెత్తఁ దిరుగంగాఁ గారణం బేమొ? నా
దృష్టిన్నిల్చియు నచ్చఁజెప్పఁగదవే! శ్రీ బాలలింగేశ్వరా! 78

మ. ధనదుండాప్తుఁడు, కొండికొండ గృహ, ముద్యత్కాంతి భాసిల్లు కాం
చన శైలేంద్రము చాప, మెల్లవిధులన్ సద్భాగ్యముల్ గల్గఁ, బు
త్త్రినకుం బెండిలి సేయఁజాలని మహాత్మున్ గొల్చుచున్ కొంటనం
టిన నాబోటికిఁ గల్గునే ఫలము? తండ్రీ! బాలలింగేశ్వరా! 79

మ. అనలంబౌ నయనంబు, భస్మకలితంబౌ దేహముం, రమ్యభూ
షణముల్ పాములు, ప్రేతభూమియె నివాసం,బివ్విధిం నీవు ని
ర్ధనికత్వంబున నొప్ప నిన్ను సతముం బ్రార్థించు దీనవ్రజం
బునకే భాగ్యము లీయఁజాలుదువు? శంభూ ! బాలలింగేశ్వరా ! 80

మ. తన కుండాత్రిశ్చిదకున్న సెల్లపనులం ధ్వంసంబు గావించు నీ
తనయాగ్రిమణి, తన్నుఁగొల్వని యెడన్ దర్పోద్ధతిం గ్రమ్మింగసెం
చును నీగేహిని యాదిశక్తి, మఱి నీచూ పగ్నియౌ, నిట్టిమి
మ్మనయంబున్ మదినమ్ముటెట్లు? శివ! సాంబా! బాలలింగేశ్వరా! 81

మ. దొరవైనందుకు సేవకవ్రజము సంతోషంబునం జేయు స
త్పరి చర్యల్ గొని పోషణంబొనరుపన్ ధర్మంబగున్ గాని, యు
ష్మరటంచున్ శ్రమనొందు సేవకులనే సాక్కించె దీ వౌరఁల్
దొరవే నాకు లభించినావు శ్రితబంధూ ! బాలలింగేశ్వరా ! 82

మ. సురయక్షోరగ సిద్ధసాధ్య మునిసంస్తోమంబులెల్లన్ నినున్
శరణన్నంతనె రక్షసేసితివి లంచం బేమి నీకిచ్చిరో?
సరిగాఁజెప్పు మదే నిజంబగునెడం సద్భాగ్యవంతుండవ
క్కరణిందాసులఁ గోరఁజెల్లునె? శుభాంగా! బాలలింగేశ్వరా! 83

శా. పిచ్చిందిర్మిమ్మురవానివోలె సతముల్ బెండ్లాముతోఁగూడి తా
బిచ్చంబెత్తెడి పేద వెంటఁబడుచున్ వేధింపఁగా నాతఁడే
మిచ్చున్ బూదియె కాకయుండు మతిలే క్రేమేమొ వాకొంటి నీ
చిచ్చై వెళ్లెడి కంటఁజూడకు మొహో! శ్రీ బాలలింగేశ్వరా! 84

మ. కలిమాయాజనితాఘబాధఁగనఁ, గాకన్ నిన్నుఁగాఠిన్యవా
క్కుల నిందించితి నింతమాత్రమునకే కోపించి దండింపఁగాఁ
దలపంబోకుమ యెల్లకాల మపరాధం బాచరింపన్ గుమా
రులఁ దాల్మిన్ సయిరించి కావరొకో? తండ్రీ, బాలలింగేశ్వరా! 85

శా. ధన్యుండీవు మహేంద్రుఁడీవని సుధాధామాంకుఁడున్ దాత్రుతా
గణ్యుండీవని వేయినోళ్ళఁ బొగడంగా నాత్మలో నుబ్బి తా
నన్యానాదరణ క్రియాపరత వెయ్యా గ్లీయని మానని
మాన్యాల్లాగక యున్నఁజాలు శివ! సాంబా! బాలలింగేశ్వరా! 86

శా. కన్యాన్నంబుల విక్రయించుట పరుల్ గ్రాసంబుగా నిచ్చు స
ద్ధాన్యంబున్ హరియించుటల్ పరసతీ ద్రవ్యంబులన్ గోరుటల్
మాన్యక్షేత్రము లాక్రమించుట ద్విజన్మ శ్రేణి బాధించుటల్
పుణ్యంబేయని తోచె నామదికి శంభూ! బాలలింగేశ్వరా! 87

మ. నిగమంబున్ బరజాతి కిచ్చుట బుధానీకంబు! దూషించుటల్
పగసాధించు తలంపుతోఁ బరుల కొంపల్ గాల్చుటల్ మిత్రులన్
మిగులన్ మోసము సేయుటల్ నిను సదా మిథ్యోక్తులన్ దూరుటల్
తగు ధర్మంబని తోచె నామదికి నేతా! బాలలింగేశ్వరా! 88

శా. ఇల్లాలిన్ గడుబాధ పెట్టుటయు దుర్వ్రాత్యాండమున్ నమ్ముటల్
తల్లిన్ దండ్రినిఁ దిట్టికొట్టుట వృథాతర్కంబు గావించి యు
ష్మల్లీలావిధిఁ గల్లగా నుడువుటల్ సద్ధర్మమే యంచు నా
యుల్లంబందుఁ దలంచినాఁడ, శివ! శంభూ! బాలలింగేశ్వరా! 89

మ. ఒకటిన్ రెండును మూడు నాల్గనుచు నాయుల్లంబులో మత్కృత
ప్రకటాంహస్సమితిన్ గణించుకొనఁగా భారంబులై యెంతయో
వికలత్వం బుదయించెఁజిత్తమున కీవేమూర్తితో మంచిదా
రికి నన్ జేరిచి రక్ష సేయుము కపర్దీ! బాలలింగేశ్వరా! 90

శా. ఈషద్ధర్మమునైన లేక సతమున్ హీనక్రియల్ చేసి దు
ర్దోషాల్ శీర్షమునన్ వహించిన మహాదుష్టుండనౌ నేనహో!
భాషానాథ మురారి వాసవ ముఖుల్ వర్ణింప లేనట్టి నీ
వేషా లెట్టు లెఱుంగ నేర్తును? కృపాబ్ధీ! బాలలింగేశ్వరా! 91

శా. సంసారం బనునట్టి ఘోరవిష వృక్షం బొందు గల్పించి దు
ర్హింసాపాప ఫలంబు లేర్పరచి యీహేయ ప్రపంచంబులో
ధ్వంసంబౌనటుఁ జేయుచుంటివి భవద్దాసావళిన్ దేవతో
త్తంసా! నీకిదిధర్మమౌనె? సదయాత్మా! బాలలింగేశ్వరా! 92

శా. ఉన్నారెందఱొ బాంధవాప్త హితులీ యుర్విన్ గడుంబేర్మియుం
జెన్నారన్నను! గాంతురిగాని సతమున్ జేయూతగా నిల్చి నీ
కెన్నండైన భయంబు లేదనెడి వారెవ్వారు లేరయ్య! నీ
కన్నన్ నామొఱ లాలకించు నిటలాక్షా! బాలలింగేశ్వరా! 93

మ. గతివేఱొద్దియు లేకచిక్కుపడి నా కాళ్ళం బడన్ గాని వీఁ
డతిదుర్మార్గుఁడు శిక్షనీయుఁడని కుయ్యాలింప కున్నావహో!
గతిహీనుండను నేనుగానుసుమి లోకంబేలు మాతల్లి పా
ర్వతి లేదే గతియౌచు నెల్లపుడు సాంబా! బాలలింగేశ్వరా! 94

మ. ప్లవ సంపర్క దురంతదోషయుతయై వారాణసీ క్షేత్రమం
దవనీనిర్జర కాంత యొక్కతె యమర్త్యహ్రదినిన్ స్నానమం
ట వెసం దత్కలుషంబు జాహ్నవికినంటన్ గాకియై రాదొకో?
భవదన్వేషణ మాచరింపుచును సాంబా! బాలలింగేశ్వరా! 95

శా. అంతన్ దాను నుదక్ప్రవాహ సహితంబై యొప్పు కృష్ణానదిన్
సంతోషంబున మున్గి ధ్వాంక్ష తనువుం జాలించియున్ హంసయై
చింతంబాసి భవత్పదాబ్జయుగళిన్ సేవించి యుద్యత్ప్రభా
వంతంబౌ నిజమూర్తిఁ గైకొనదె? సాంబా! బాలలింగేశ్వరా! 96

మ. జగతీవ్రాత పవిత్ర కృత్ప్రథితయా స్వర్హ్రాదినిన్ గూడ శీ
ఘ్రగతాంహశ్చయగా నొనర్చిన భవత్కల్యాణ తీర్థంబు గాం
చఁగ రానట్టి మనుష్యులీపుడమి దుస్సంసార వార్ధిం దరిం
పఁగ లేరెట్టి తపంబుచేసినను సాంబా! బాలలింగేశ్వరా! 97

మ. ఘనమహా తావక దర్శనం బొనరుపఁగా గాంక్షించి విచ్చేయు స
జ్జను లచ్చోటను ప్రస్తరస్థితములౌ సద్వర్ణ పంక్తుల్ పఠిం
చినచో నుత్తరవాహినీ స్ఫుట భవత్తీర్థ ప్రభావంబు చ
య్యనఁ దెల్లంబగు భవ్యలీల శివ! సాంబా! బాలలింగేశ్వరా! 98

శా. లోకాలెల్లను బ్రోచుదేవుఁడవు సుశ్లోకుండవౌ నీవ యీ
లోకంబంతట సంచరించి సత మాలోకింప నావంటి దు
శ్లోకుండొక్కఁడుఁ గానిపింపఁ డిటు లాలోచింప బాంధవ్యమున్
నాకు న్నీ కుదయించెఁగాదె? శ్రితకందా! బాలలింగేశ్వరా! 99

శా. మాతల్ తాతలు బ్రాతలుం సకల సంపద్దాత లానంద సం
ధాతల్ త్రాతలు నీవయంచు సతము ప్రార్థింప వ్యర్థంబుగాఁ
నాతో వాదము సేయఁగాఁదలఁచుకొన్నావొక్కటా! మొక్కెదన్
జేతుల్ గోయకుమయ్య! నమ్మితినయా! శ్రీ బాలలింగేశ్వరా! 100

శా. కస్తూరీ సురభిప్రశస్త హిమవత్కన్యాస్తనస్నిగ్ధ వి
న్యస్తంబై, జగతీసమస్త శుభదంబై, పూతమై, యొప్పు నీ
హస్తద్వంద్వముసాచి వత్స! యిటురారా! యంచు నోదార్చి నా
మస్తంబుం దగమూరుకొం చభయమిమ్మా! బాలలింగేశ్వరా! 101

శా. పాలున్నీరును గల్పియుంచునెడ సద్భావంబుతో హంస యా
పాలందాగి జలంబు వీడునటు లీ పద్యసమా దోషవా
గ్జాలంబుం విడనాడి మంచి నుడులే గ్రాహ్యంబుగాఁ జేసికొ
మ్మా! లక్ష్మీపతి జప్యనామ! శివ! సాంబా! బాలలింగేశ్వరా! 102

మ. ప్రమథామర్త్యముఖుల్ భజింపఁగ భరద్వాజేశ్వరాఖ్యన్ మహీ
ధ్రముపైనుండిన నీకుఁ జారుతరలీలం బాలలింగేశ నా
మము సంధించియు సాధు సమ్మతముగా మత్తేభ . శార్దూల వృ
త్తములంగూర్చితిఁ జిత్తగింపుమిదె; నేతా! బాలలింగేశ్వరా! 103

శా. తీర్థాలాన్వయజుండ శిష్టహితవాదిం విశ్వనాథాఖ్యుఁడం
వ్యర్థంబైన పథాన వర్తిలక మోక్షాపేక్ష యుష్మత్ప్రమో
దార్థంబై విరచించినాఁడ శతపద్యంబుల్ జటావిస్ఫుర
న్మార్థా! యీ కృతి వేగఁజేకొనుము శంభూ! బాలలింగేశ్వరా! 104

హరిః ఓంతత్సత్ శ్రీమ ద్బాలలింగేశ్వర పరబ్రహ్మార్పణ మస్తు.

## శ్రీ రామ స్తుతి

శా. శ్రీమద్భక్త చకోరసోమ! సుకృత శ్రీ విస్ఫురన్నామ! సం
గ్రామ క్షోణి విరోధి భీమ! ధరణీ కన్యా మనఃకామ! ని
ష్కామా! భద్రగిరీంద్రధామ! విధి శక్ర స్థాణు సంస్తోమ! శ్రీ
రామా! దైత్యవిరామ! నన్నుఁ గృపతో రక్షింపవే మ్రొక్కెదన్. 1

శా. ఏ నామంబు దలంచినన్ వినిన నింకేనామమున్ బల్కినన్
నీ నామంబె స్ఫురింపుచుండు మదికిన్ నిశ్శేషపుణ్యప్రదం
బౌ, నీనామమునే స్మరించెదను మోక్షార్థమ్మున్ ననుం జేయవే
జ్ఞానానందమయస్వరూప! కరుణాసల్లాప! సీతాధిపా! 2

ఉ. నీ చరణాబ్జముల్ కొలుచు నిర్జర యోగిమునీంద్ర ముఖ్యులన్
బ్రోచుటె కాక వైరమును బూని సదా నిను ధిక్కరించు దో
షాచరకోటికెల్ల స్థిర సౌఖ్యపదంబిడినావు తద్విధిన్
బ్రోచెదవంచు నన్నుఁ గడుమోదము నొందుచునుంటినయ్యా! భ
ద్రాచలరామ! ధర్మనిచయస్ఫుటధామ! కటాక్షముంచుమా! 3

## శ్రీ హనుమత్ప్రార్థన

శా. శ్రీరామస్మరణ స్వభావ! గిరిపుత్రీ భర్తృతేజోద్భవా!
సూరీంద్ర స్తవనీయ భవ్యచరితా! సూర్యాత్మజా మోహితా!
కారుణ్యావిత విశ్వభక్తనివహా! కామాదిషట్కాపహా!
సారోదార పరాక్రమ ప్రకటతేజా! గంధవాహాత్మజా! 1

ఉ. దానవభేకసర్ప! పరిదారిత సాధువిరోధిదర్ప! స
మ్మానిత రామభద్ర! శ్రితమంగళదాన కృపాసముద్ర! క
ల్యాణచరిత్ర! దేవనిచయస్తుతిపాత్ర! సుభక్తలోక చే
తో నవసౌధవాస! భవదోషవినాశ! నవావతారకా! 2

క. శంకృత్ప్రకృతీ! ఓం హ్రాం, హ్రీంకృతిముఖ బీజవర్గ హృతభేతాళా!
హుంకృతి మద్ధృతిప్రా, లంకృతి! శ్రీమత్సువర్చలా ప్రాణపతీ! 3

శా. జోహారుల్ పచరింతు నీకు సుజనస్తోమైకరక్షా మహో
త్సాహా! ధ్వస్తసమస్త శత్రునివహా! స్వర్ణాద్రితుల్య స్ఫుర

ద్దేహా! భక్తమనోంబుజాత సుమహద్గేహా! హృతాంహస్సమూ
హా! హృద్యాంచిత పంక్తికంఠ పురదాహా! సత్కృపాధూర్వహా! 4

ఉ. పుట్టితి వంజనాసతికి, భూతపతిప్రథితాంశచేతఁ జే
పట్టితి వీవు రామపదభక్తి, యుగాంతమునన్ విధాతవై
నెట్టన సృష్టిసేయుదువు నీ పదముల్ భజియింప నట్టివాఁ
డెట్టుల జీవితాబ్ధిఁ దరియింపఁగలండు మదిష్టదైవమా! 5

ఉ. అంతములేనిదై, శ్రుతిచయాంతవనాంత విహారమై, శ్రితా
త్యంత శుభప్రదంబయి, నిశాట పిశాచ పరేతభూత గ
ర్వాంతకమై, త్రిమూర్తి మయమై, వెలుఁగందు భవత్తనుద్యుతిన్
స్వాంతమునందు నిల్పెదను సంశ్రితచందన! వాయునందనా! 6

ఉ. శాత్రవు లార్వు రేకమయి సంసరణాంబుధిముంప దుష్క్రియా
పాత్రతఁగూర్చు మిత్రతతి పైపయిఁ బేరిమి పల్కులాడ నే
మాత్రము నీడకే కలుషమండల ముద్ధతి బాధసేయఁ దా
పత్రయిఁ జిక్కినాఁడను భవత్పదభక్తి సతంబుఁగూర్చి మూ
ర్తిత్రితయాత్మ రక్షణ ధురీణుఁడవై వ్యథలెల్లఁ బాపవే! 7

మ. భవదుద్యత్కరుణా కటాక్షమున స్వల్పవ్యక్తినౌ నాకు ని
క్కవితా విజ్ఞత కల్గె;దీనికతనన్ గాలుష్య భూయిష్ఠ దు
ర్భవపాథోధిఁ దరింపనేర్తునని విశ్వాసంబుతో నుంటి, శీ
ఘ్రవిధిన్ నన్నుఁ గృతార్థుఁజేయుము సుధీరంజన్మతీ! మారుతీ! 8

## శ్రీ మద్వేదాద్రి నృసింహ స్తవము

ఉ. శ్రీ ద్రుహిణాబ్జమాళి! పవిభృన్ముఖ పూజితధామ! భక్తక
ల్పద్రుమ! సత్కృపాప్రకట పాలితపద్మ భవాండవార! పా
పద్రుకుఠార! చక్రధర! భవ్యగుణాకర! శౌర్యరంహ! వే
దాద్రి నృసింహ! తావకపదాంబుజముల్ భజియింతు నెప్పుడున్. 1

క. అంహస్సంయుత దితిసుత, సంహార! దురంతకల్మష ద్విపవిదళ
త్సింహా! వేదాచల నర,సింహా! చేకొనుము భక్తిఁజేయుదువినతుల్ 2

శా. స్తంభంబందు జనించి, హేమకశిపున్ ధ్వంసంబు గావించి, ముగ్
డింభగ్రామణి నేలి తీవనుచు వింటిన్ గాని, నీమూర్తి ని
ర్దంభత్వంబున నేత్రపర్వముగ సందర్శించితిన్ నేఁ డహో!
యంభోజాక్ష! ముకుంద! వేదగిరిగేహా! నారసింహప్రభూ! 3

శా. కృష్ణాహ్రదినిలోనఁ గ్రుంకులిడుటన్, శ్రీ మన్మహారూపరో
చిష్ణున్ నిన్నుఁ ద్రిలోకమాతయగు నీ శ్రీ రాజ్యలక్ష్మీసతిన్
జిష్ణుస్వస్థితిఁ గాంచుటన్ సుకృతిగాంచె న్నాదుజన్మంబహో
కృష్ణాతీర పవిత్ర వేదగిరి లక్ష్మీనారసింహ ప్రభూ! 4

ఉ. జ్ఞానమొకింతలేక, పరుషస్థితి దూషణఁజేసినాఁడ, కు
జ్ఞానుల, నెన్నరాని కలుషంబు లొనర్చితిఁగాన, దీన సం
త్రాణపరుండ వీవగుటఁ, దప్పులు సైచి దయాస్పదుండవై,
భానుతనూజ కింకరులు బాధలు పెట్టెడి కాలమందు; ల
క్ష్మీనరసింహ! నాకు దయసేయఁ గదయ్య కరావలంబమున్. 5

ఉ. శ్రీయుత! పండరీనిలయ! చిద్ఘనకాయ! మహాకృపామయా!
తోయజగర్భశైల రిపు ధూర్జటి ముఖ్యసుపర్వగేయ! దై
తేయ కృపీట భృత్పవన! దీనజనావన! రుక్మిణీ మనో
నాయక! గోపికాజన మనస్సుఖదాయక! నీకు మ్రొక్కెదన్. 6

ఉ. కాముని తండ్రివంచు, గతకాముఁడవంచు, ననేక గోపికా
కాముఁడవంచు, సంతత జగత్పరిరక్షణ హేతుదేవతా
గ్రామణివంచు, సంశిత్ర శిఖామణివంచు, సదా సుధీజన
స్తోమము సన్నుతించుటలు చూచితిఁగాని, జడుండనైన నే
నీ మహిమన్ మదిం దెలియ నేర్తునె? మౌనిహృదీప్సిత ప్రదా! 7

సీ. కరిరాజు ప్రార్థింపఁ గరుణతో నేగి మ
కరిఁ గూల్చితివని కొందఱు వచింత్రు
ప్రహ్లాదుఁడు వేఁడ రయమునఁ దజ్జన
కుని వధించితివంచుఁ గొందఱందు్రు
నిర్జరుల్ వినుతింప నిఖిల రాక్షసకోటి
హరియించితివని కొంద ఱాడుచుందు

కెన్నో స్వరూపము లెలమిఁ దాల్చెదవంచుఁ
బనివడి కొందఱు పలుకుచుంద్రు
తే. గీ. రిట్టి సుజనుల వాక్యము లెల్లవింటిఁ
గాని ననుఁబోలు జడునకుఁ గలుష మాన
సునకుఁ దన్మహార్థ మెఱుంగు శుభగుణంబు
లలరునే? పాండురంగ! దయాంతరంగ! 8

ఉ. ఆర్యజనాళిఁ గాంచి, పరిహాసముఁ జేసితి, నీచవృత్తి దు
ష్కార్యము లాచరించితిని, సాధు విదూరుఁడనైతి, నింతయున్
ధైర్యములేక చాల పరితాపముఁ గాంచెను గాన సత్కృపా
ధుర్య మదీయదోషములఁ ద్రోసి భవాబ్ధిఁ దరింపఁజేయవే! 9

శా. ఆనందస్థితిఁ బండరి న్గనుట దివ్యచ్చంద్రభాగానదిన్
స్నానం బాడుట, భక్తబృందములతో నర్తింపుచున్ రమ్య రు
క్మానారీమణితోడ వెల్గెడి నినుం బ్రార్థించుటల్ సర్వదా
యీ నా పాపపు జన్మకుం గలుగదోయీ! పాండురంగప్రభూ! 10

ఉ. దేహముచుట్టు మూగుచు సతీసుత బంధులుఁ దల్లిదండ్రులున్
స్నేహితులేడ్చుచుండ, మదసింధుర తుల్యులు ప్రాణసంగ్రహో
త్సాహులు, కాలకింకరులు దండనఁజేసెడివేళ, యోగి హృ
ద్గేహ! కరావలంబమిడి దీనుని నన్ను ననుగ్రహింపవే. 11

మ. చలనంబింతయులేని భక్తుఁడయి, హస్తద్వంద్వమున్ మోడ్చి, దృ
ష్టుల నీమూర్తినిఁ గట్టివైచి, సతమున్ స్తోత్రంబుఁ గావించు వి
ట్ఠల దాసుం గృపఁ జూచినావు కడు తంటాల్చెందు తచ్ఛిష్యవ
ర్యులమా మమ్మొక కంటనైనఁ గనవేమోయీ? జగద్రక్షకా! 12

సీ. శ్రీ తుకారామ్ నివృత్తిజ్ఞాన సోపాన
దేవ పుండరికులఁ బ్రోవలేదె?
సాత్త్విక సురదాస జయదేవ భాను చో
ఖామేళు నాములఁ గావలేదె?
గోరా, పుకా, రోహిదాస, కూర్మదాస, లతీబు
జంబు పరీటుల సాకలేదె?

ప్రేమా జనా సక్కు- రామా శిలా ముఖ్య
మహిళామతల్లుల మనుపలేదె?

తే. ఇంక నెందఱో భక్తుల నేలినావు
వారి నిర్మల భక్తి నీ ప్రకట శక్తి
నెన్న నెనెంతవాఁడను విన్నపంబు
విని, మదఘముల సమయింప వేఁడుచుంటి
ధన్యగుణజాల! విఠ్ఠల దాసపాల! 13

సీ. ప్రథితమౌ రామన్న పాలెము జన్మ సం
స్థానమై భూస్థలిఁ దనరువాఁడ
తీర్థాలకుల సుధావార్ధి విధుండగు
నరసింహ శాస్త్రికి నందనుండ
అంజనాదేవి ప్రియాత్మజ సుకటాక్ష
వీక్షణ ప్రాప్త కవిత్వయుతుఁడ
తావక దాసానదాస దాసాంఘ్రి వా
రిజ రేణు సముదలంకృత శిరుండ

తే. త్వత్ప్రపాలిత విఠ్ఠల దాసునకును
పేర్మి మేనమరందిని, విశ్వనాథ
నామధేయుఁడ, మదిఁదోచిన విధముగను
తప్పులో యొప్పులో యొప్పఁజెప్పితి నవ 14

గీ. రత్నముల, భూరి సురభి విరాజిత సుమ
మాలగా గ్రహియించి, కృపాళుఁడవయి
నన్ను రక్షింపుమీ! ప్రభూ! నమ్మినాఁడ
భక్త హృదయాబ్జ భృంగ! శ్రీ పాండురంగ! 15

## శ్రీ విఠ్ఠలదాసస్తుతి మత్తేభరత్న పంచకం

అలఘుప్రోజ్జ్వల పాండురంగ చరణధ్యాన ప్రమోదాబ్ధి ని
శ్చలచిత్తంబున నోలలాడుచును శిష్యశ్రేణికిన్ మోక్షల
భ్యలఘూపాయముఁ గూరిమిం దెలుపు దివ్యజ్ఞాన ధౌరేయు వి
ఠ్ఠలదాసాభిధు, సద్గురూత్తము, నఖండప్రీతి సేవించెదన్ 1

కలిమాయాబ్ధినిమగ్నులై, విపుల దుఃఖస్వాంతులై, ఘోరపా
పలతావేష్టితులై, యజస్రము మహాబాధావళిం జెందెడు లో
కులకున్ వేదరహస్యమంత్రమును సద్గోష్ఠిం బ్రసాదించు వి
ఠ్ఠలదాసాభిధు, సద్గురూత్తము, నఖండ ప్రీతి సేవించెదన్. 2

ఇలధర్మవ్యతిరేక మార్గచరులై, హేయప్రలాపంబులన్
బలుభంగుల్ మతభేదవాదములచేఁ బాపంబు నార్జించు వా
రల నద్వైత మహత్త్వ తత్త్వరసముం ద్రావించి మెప్పించు వి
ఠ్ఠలదాసాభిధు, సద్గురూత్తము, నఖండ ప్రీతిసేవించెదన్. 3

జలదశ్రేణులఁ బారఁదోలెడి నభస్వద్భంగి, సంసార దు
ష్కలుషౌఘంబును రంగనామ జపదీక్షా శక్తిచేఁ గూల్చి, మం
జులశాంత ప్రథితానువర్తనమునన్ క్షోణిన్ విరాజిల్లు వి
ఠ్ఠలదాసాభిధు, సద్గురూత్తము, నఖండప్రీతి సేవించెదన్. 4

జలజాతాహితుఁ డంతరిక్షమున నక్షత్రాళి మధ్యస్థుఁడై
చెలువొప్పన్ విహరించు మాడ్కి, సుకళా శ్రీపూర్ణుఁడై, శిష్యము
ఖ్యులతోఁగూడి చెలంగు రంగభజనోద్యోగ ప్రధానాత్ము వి
ఠ్ఠలదాసాభిధు, సద్గురోత్తము, నఖండ ప్రీతి సేవించెదన్. 5

## శ్రీ వేంకటేశ్వర ధ్యానము,

సీ. శ్రీమదఖండ రాజీవగర్భాండ ప్ర
కాండప్రపోష! శృంగారవేష!
సరసిజాసన పురశాసన ప్రముఖ! స
మర్చితపాద! సత్యప్రవాద!
సురుచిర శ్రీవత్స శోభితప్రృథువక్ష!
యఖిలజగత్త్రాణ కాంక్షిత దక్ష!
అలమేలు మంగాముఖాంబుజ రోలంబ!
యాశ్రితభక్త! దయావలంబ!

తే. అవని భారనివార ణార్థావతార!
సాధు నేత్రచకోర నిశాకరత్ర!
భూరిసంసారకల్మషాంభోధి తరణ!
తిరుపతినివాస! వేంకటేశ్వర! నమోఽస్తు.



బెజవాడ : ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
అ. వెంకటరత్నం M. Sc. గారిచే ముద్రింపఁబడియె - 1944.




# కళాపీఠ ప్రచురణములు

స్థాపకుడు : తాండవ కృష్ణ

1. **The History of Andhra Commerce**
   Dr. K. R. Subrahmanyam, M. A., Ph. D. 0-2-0
2. **Andhra Social Life & Organisation**
   Dr. B. Sheshagiri Rao, M. A., Ph. D., M. R. A. 0-8-0
3. **Folk Dances — Joy of Life** 0-3-0
   Thandava Krishna
4. శ్రీ కళ్యాణపానసుషమ (సంస్కృతము) 0-2-0
   విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావు, బి. ఓ. ఎల్.
5. భారతీయనాట్యము 0-12-0
   తాండవకృష్ణ
6. రాణీసోమ (ఆంధ్రుల చరిత్రచాటు నాటిక) 0-8-0
   రాజ రాధాకృష్ణశాస్త్రి
7. కౌముదీ మహోత్సవము (నాటకము) 1-0-0
   దివాకర్ల వెంకటావధాని, బి. ఏ., ఆనర్సు
8. అమరకోశము (400 పేజీలు) 3-0-0
   అమరసింహుడు
9. "మాటపదహార్లు" 0-4-0
   (బాలబాలికలు కంఠపాఠము చేయదగిన పద్యరత్నములు)
10. రేఖావళి 0-4-0
    (అందమైన రేఖాచిత్రాలు ఆనందకరమైన గేయాలు)
    తాండవకృష్ణ సంకలితము
11. వాఙ్మయమున నేను! ఆం. వేం. కృష్ణమూర్తి, ఎం. ఏ. 0-3-0
12. సౌందర్య కళారహస్యము 0-4-0
13. శ్రీ బాలలింగేశ్వర శతకము 0-8-0
    శిష్టాల విశ్వనాథశాస్త్రి


